Regd No. N. 45 / M. 3813

గోలకొండ

ఈరాఖులో బ్రిటిషు విజయములు

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౬ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ వృషసం॥ర వైశాఖబ॥ ౧ (౬-౮-౧౩౫౦ ఫ.) సోమవారము

# ఈరాఖుస్థితిలో గొప్పమార్పులేదు

## తుర్కీ మంత్రివర్గమందు ఈరాఖును గూర్చినచర్చ

మే ౫వ తేదినుండి ౯ వతేదివరకు వచ్చినవార్తల నుపరిశీలించినమీద, అక్కడ ఈరాఖుసేనలతో బ్రిటిషుసేనలుచేయుచున్న పోరాటమునరెండవవారికి కొన్ని విజయములువచ్చినట్లు వార్తలువచ్చినవి కానిపరిస్థితిలో గొప్పమార్పేమియు కనిపించుటలేదు. పోయినసంచికలో రుత్బాను ఈరాఖువారి సేనలుపట్టుకొన్నట్లు తెలిపియుంటిమి. దానిని బ్రిటిషుసేనలు తిరిగిఆక్రమించుకొన్నట్లు మే ౭వ తేదినాటివార్తలోనున్నది. ఈరుత్బా మోసాలులో పెట్రోలుగనులనుండి హైఫావరకు నిర్మితమైన చమురుగొట్టపుమార్గమువనున్నవి. ఈమార్గములో అనేకముఖ్యస్థానాలలోనుండు ఈరాఖుసైనికులు బ్రిటిషుసేనలకులొంగినవట, తర్వాత బ్రిటిషు సేనలు ఆస్థానములను ఆక్రమించుకొనినవట. హబ్బానియా కంటోన్మెంటుకు నేరుగా దక్షిణముననున్న పీఠభూమిలో శత్రువులు లేరు. మే ౬వ తేదిన బ్రిటిషుసేనలుకొందరు ఈరాఖుసైనికులలో కలిసి హబ్బానియా కంటోన్మెంటుకు ఎత్తునయుండి పీఠభూమిలో మకాముకు అనుకూలపడువట్టి ఉన్నత స్థానాలనుండి ఈరాఖుసైనికులను తరిమివేసినవి. తుదకు ఈరాఖువారివిమానాలలో సగముకంటె ఎక్కువనష్టపడుటయేగాక మందుగుండుసామగ్రి కూడనిరంతరముగావాడుటకు చాలినంతలేకపోవుటవల్లనుప్పుసంగావాడుకొనవలసినదని ఈరాఖుసైనికాధికారులు తమసేనలకు ఆజ్ఞనిచ్చినారు. బ్రిటిషువారికి ఈరాఖులో ౬ తుపాకులు ౪౦౦ మందికిపైగా సైనికులుపట్టుబడినారట. హబ్బానియా నెదిరించిన ఈరాఖుసేనలు రామాదీకిని ఫలూజాకును వెళ్లిపోయినవట. బాస్రాలో బ్రిటిషుసేనలు మరికొన్ని వర్తకభవనములను, బ్యాంకుభవనములను, టెలిగ్రాఫుఆఫీసులను ఆక్రమించినట్లు మే ౯వ తేదినాటివార్తలోనున్నది. ఇంకనుపోరాటముజరుగుచునేయున్నది.

ఇకవిమానదాడులసమాచారములను గమనించెదము. బ్రిటిషు విమానాలు మే ౫వ తేదిన హబ్బానియా విమానాశ్రయంమీదను, దివానియాలో సైనికభవనాలమీదను, ఫలూజాలో మోటారుబండ్లమీదను బాంబులువేసినవి. ౬వ తేదిన మొవాస్కర్ ఆల్ షిద్ అనుచోటవిమానాశ్రయంమీద వేసినబాంబులచేత అనేకవిమానాల నష్టమైనవట, ౭వ తేదిన బాగ్దాదువద్ద వాషాష్‌లో మందుసామగ్రి యున్నచోటిపైనను, హానియాదిలో క్రిందనుండి వవిమానాపైనను బాంబులువేయబడినవి. రషీదులో విమానాశ్రయములపై ౮వ తేదిన బాంబులు వేయబడినవి.

ఇదియిట్లుండ, నిజమోఅబద్ధమోగాని రషీద్ ఆలీ బాగ్దాదులో ప్రజలు తనచర్యలకువ్యతిరేకముగా నగోలలుపెట్టుటచే బాగ్దాదునుండి వెళ్లిపోయినట్లు ఒకవార్తవచ్చినది. ఈరాఖుదేశరక్షణశాఖమంత్రియగు నజీసయ్యద్ షౌకత్‌గారు మే ౯వ తేదిన తుర్కీ, కిపోయిరి. తుర్కీ మంత్రివర్గముయొక్క ఒక ముఖ్యసమావేశము అమధ్యాహ్నము ప్రధాన మంత్రియింటిలో జరిగినపుడు ఈరాఖువ్యవహారములను గురించికూడచర్చజరిగెనట. ఈసమావేశముతర్వాత నజీసయ్యద్ షౌకత్‌గారు తుర్కీ ప్రధానమంత్రితోను, విదేశాంగమంత్రితోనుసంభాషించిరి. అటుతర్వాతమరలతుర్కీ మంత్రివర్గ సమావేశముజరిగెను. తుర్కీలో బ్రిటిషు రాయబారికూడ తుర్కీ విదేశాంగమంత్రితో సంభాషించి నజీసయ్యద్ షౌకత్‌గారువచ్చినపనినిగురించి తెలిసికొనిరట ఈరాఖుదేశరక్షణమంత్రి తుర్కీ వచ్చిన ముఖ్యనేరములలో నొకటి తుర్కీలో ఉండే జర్మనురాయబారితో సంభాషించుటయనికొందరు తలచుచున్నారు. ఆజర్మనురాయబారి ఇపుడుబర్లినులో ఏదోమాట్లాడుచున్నాడు ఇంకనుతుర్కీ రాలేదు.

తుర్కీ వారిపుడు తమదేశానికిఈరాఖుదేశంతో గలసరిహద్దువైపు సైన్యములనుంచుచు జాగ్రత్తగానున్నారు. తుర్కీ అధ్యక్షుడగు ఇనూనుగారు తుర్కీ రాజ్యంలోనిపడమటిరాజ్యాలలో పర్యటనముగించుకొని తిరిగివచ్చినారు. తుర్కీలో కిఇపుడు జర్మనునాజీలఏజంట్లు అధికంగావచ్చుచున్నారట. తుర్కీ వైఖరిఇంతవరకును బ్రిటనుకనుకూలంగాను ఉండుటకై తానుపోరాటంలోదిగకుండవలెనమనదిద్దియుండెను. కానిగ్రీసులో జర్మనులు జయముపొందినతర్వాత ఇపుడుఎవరికిగాని సహాయము కల్గించకుండా సంపూర్ణముగాతటస్థముగానుండవలెననితుర్కీ ఉద్దేశించినదని ఒకవిలేఖరి వ్రాయుచున్నాడు

ఈరాఖుప్రక్కనుండే ఇరాన్‌లోకూడా జర్మనునాజీలఏజంట్లుఅపరిమితంగా ప్రవేశించుచున్నారనువదంతిని తుర్కీలో ఇరానురాయబారి కార్యాలయమువారు అసత్యమనిఖండించినారు.

### గ్రీసువ్యవహారము

తుర్కీకిసులభంగా అందుబాటులోనుండు మైటిలీను, షియోస్ అనుదీవులను జర్మనులు పారషూట్లనుండిదిగిఆక్రమించుకొన్నారు. ఈదీవులు స్మర్నాసి ధుశాఖలో ప్రవేశించుద్వారమున కిరుపైపులనున్నవి. డార్డనల్సునదక్షిణంలోనున్నవి.

గ్రీసులోజర్మనులు ఒక గ్రీకుసైనికాధికారి ప్రధానిత్వమున ప్రభుత్వమునొకదానినిఏర్పాటుచేసియుండిరిగదా ఆసైనికాధికారినిఇక్షేపురిసి గురు గ్రీకుసైనికాధికారులను గ్రీకురాజునకువ్యతిరేకముగ జర్మనులకుతోడ్పడుచున్నారను ఆక్షేపణమాపి ఇపుడు క్రీటులోనుండి గ్రీకుప్రభుత్వమువారు గ్రీకుప్రభుత్వోద్యోగములోనుండి తొలగించినట్లు ప్రకటనచేసినారు. గ్రీసు నౌకాసైన్యమునకు జర్మనుశత్రువుముతోముడిబెట్టబడినది, ఏథెన్సునగరంలో జర్మనుసేనలు తమవిజయమునుసూచించుటకై కవాతుచేసినవి, ఇటాలీయసేనలుగూడపాల్గొన్నవి క్రీటులోకిచేరినగ్రీకుసేనలును, తక్కినబ్రిటిషు, ఆస్ట్రేలియాసేనలును, గ్రీసుసహాయానికైవచ్చియుండిన న్యూజీలాండుసేన అధిపతియైన ఫ్రెబర్గుగారి నాయకత్వమునకలిపియుంచబడినవి.

గ్రీకుజలాంతర్గాములు బ్రిటిషునౌకలతోచేరుటకై అలెగ్జాండ్రియాకుబయలుదేరినవి ౧౦గ్రీకుడిస్ట్రాయర్లకుగాను మూడుసముద్రంలోముంచివేయబడినవి. ౧౩టార్పెడోపడవలకుగాను రెండుఅలెగ్జాండ్రియాకుచేరినవి.

గ్రీసులోఎక్కువెక్కువ బ్రిటిషుసామ్రాజ్యసేనలలోని ౧౧౫౦౦మంది నష్టమైనారని బ్రిటిషుప్రభుత్వపుకాలనీలసెక్రటరీగారు ప్రకటించినారు ఇందులో ఆస్ట్రేలియావారిసైనికులు ౩౦౦౦మందియని ఆస్ట్రేలియామంత్రికి తెలిసినది గ్రీసుకుపంపబడిన ఆస్ట్రేలియాసేనలలో ౧౭౦౦౦మందియుండిరి.

### యుగోస్లావియా

యుగోస్లావియాకొండలలో సర్బియాసైనికులు ఇంకనుజర్మనులకుచిక్కకుండగలిగిందుకుద్యేశ్యముతో పోరాటములను చేయుచున్నారు. దీనివల్లఇపుడు జర్మనులను యుగోస్లావియానుండి తరిమివేయవీలుకేకున్నను యీపోరాటమును యుద్ధముముగియువరకు సాగించుచునే యుండగలరట,

యుగోస్లావియా పూర్వప్రభుత్వము ఇపుడు పాలెస్టైను ప్రాంతములోఎక్కడనో ఉన్నది. అప్రభుత్వము మే ౫వ తేదిన గావించినయొక్క ప్రకటనలో 'యుగోస్లావియాకు పీటర్ రాజుగారి ఛత్రచ్ఛాయక్రింద స్వాతంత్ర్యములభించువరకు యుగోస్లావియావారలగు సర్బులు, క్రోటులు, స్లోవనులు ఇంకనుపోరాటములను సాగించుచునే యుండగలరని తెలిసినది క్రోటులక్రోషియానందమనియుద్ధానికి ముందుజర్మనులు చెప్పియుండిరట కానిఇపుడుఆక్రోషియాలోపెద్దప్రాంతములను హంగరీకిని ఇటలీకిని ఇచ్చివేసినందుకై క్రోటులుఅసంతృప్తి చెందియున్నారని బ్రిటిషువారిపైపునుండి వచ్చెవార్తలలో ఉంటున్నది. బ్రిటిషుప్రభుత్వమువారు ప్రవాసంలోనున్న యుగోస్లావియాప్రభుత్వమునే అసలుయుగోస్లావియాప్రభుత్వమునితలచును, అప్రభుత్వమువద్ద ఇదివరకురుమేనియాలో తమరాయబారిగా నుండిన సర్ రెజినాల్డుహోరుగారిని రాయబారిగనియోగించినారు. కానిరష్యావారు యుగోస్లావియా స్వతంత్రదేశమని ఇకమీదతలచబోవలేదనుచు పూర్వయుగోస్లావుప్రభుత్వముచే రష్యాలోనియుక్తమైన రాయబారవర్గమును అంగీకరించలేమని తెలియబరచినారు. బెల్జియములుకూడ స్వతంత్రదేశాలుకానందున తమదేశంలోవాటి రాయబారవర్గాలను ఆమోదించజాలమని రష్యాప్రభుత్వమువారుఆదేశాలవారికికూడ తెలియబరచినారు, ఇదివరకు ఇటలీలోనుండిన యుగోస్లావురాయబారవర్గమునకుచేరిన ౧౬౭మంది అధికారులిపుడు అమెరికాకుప్రయాణమైనారు, అమెరికారేవులలోనుండే యుగోస్లావియానౌకలలోని ఉద్యోగులు పూర్వపుయుగోస్లావుప్రభుత్వమునందు భక్తిగలవారాకోరాయని పరీక్షించుటకనిచెప్పుచు అమెరికాసముద్రతీరరక్షకాధికారులు అనౌకలపైఎక్కిఆక్రమించినారు.

యుగోస్లావియాలో జర్మనులుక్రొత్తగాఏర్పాటుచేసిన క్రోషియారాజ్యమును ఒకస్వతంత్రరాజ్యంగా రుమేనియావారు ఆమోదించినారు.

అంతటిలో గ్రీసురాయబారియగు సైమోపులాస్‌గారు మే ౬వ తేదిన ఒకవిందులో ఉపన్యసించుచు పోయిన ౫౦ ఏండ్లలో ఇంగ్లండు ఆగ్నేయాఆసేన ఎక్కువగా సాయముచేసినదని నిందించినారు.

### రుమేనియా

ఇప్పుడు లండనులో రుమేనియా స్వాతంత్ర్యకాముకులగు రుమేనియనులు ఒక సంఘమును ఏర్పరచినారు ఈసంఘము పేరు "రుమేనియన్ డెమొక్రాటిక్ కమిటి" రుమేనియనులు ఒక సైనిక దళము నేర్పరచి బ్రిటనుతో చేరి పోరాడగలరని ఈ సంఘమువారు రుమేనియనులకు విన్నవించినారు. ఈ సంఘము వారికి రుమేనియాలో ప్రజాస్వామిక పద్ధతిని కాంక్షించుచు ప్రజల సంఘములలోని ఆమెరికా సంయుక్త రాజ్యములలోని ౪ లక్షల రుమేనియనులతోను సంబంధమున్నది, యుద్ధానంతరము శాసనబద్ధమైన ప్రభుత్వక్రింద ప్రజాస్వామిక పరిపాలనము కావలెనని ఈ సంఘము[illegible] ఆదర్శము,

# బెనారసు సంస్థానములో సత్యాగ్రహము

బెనారస్ (కాశీ) సంస్థాన కాంగ్రెసుసంఘమువారు సంస్థానమంత్రిగారికి విజ్ఞప్తిని పంపుకొన్నారు. ఇటీవల వెల్లడియైన సంస్థానరాజ్యాంగ సంస్కరణములలో నిషయము కొన్ని ఆవసరము గుమార్పులనైనచేయుండీఅని మనవిచేసుకొన్నారు. కాని వారికి తృప్తికరమగుజవాబు దొరకకపోయెను. అందుచేత ఆసంస్థానకాంగ్రెసువారు మే౭వ తేదినుండి సత్యాగ్రహము ప్రారంభింప నిశ్చయించిరి.

మొదటి సత్యాగ్రహి బలదేవతేవారీ అనువారు.

### బ్రిటనుపై జర్మనుల దాడులు

బ్రిటిషువారి విమానములు ఏప్రిలు ౩౦వ తేది పగలు వచ్చి సముద్రతీరమువద్ద పోవుచుండిన శత్రునిమానములపై బాంబులను వేసెను. ఈదాడినుండి ఒకవిమానము తిరిగిరాలేదు. ఆనాటి రాత్రి బ్రిటిషువిమానములు జర్మనీలో నౌకల మూలస్థానమగు కీలుపైనను, పారిశ్రామిక కేంద్రమగు హాంబర్గుమీదను, యుండన్ రేవుమీదను బాంబులనువేసినవి. మే ౧వ తేదిన పగలు హాలెండులో జర్మనుల జలాంతర్గాములుండు డెన్ హెల్డర్‌పై బాంబులువేయబడినవి. హాలెండు సముద్రతీర సమీపమునందు శత్రునౌకలమీదను: ఒకపెట్రోలు ఖజానామీదను బాంబులువేయబడినవి-ఒక ట్రోలుగనిపోవునాక ఈదాడిచే చాలా చెడిపోయినది-ఈదాడినుండి ఒకవిమానము కనిపించుటలేదు-అరాత్రి జర్మనీ వాయవ్యభాగంపై బ్రిటిషు విమానాలదాడులు జరిగినవి. మే౩వ తేదిరాత్రి బ్రిటిషువిమానాలలోనున్నైనను బ్రెస్టువద్ద డాకులమీదను బాంబులనువేసినవి- బ్రెస్టువద్ద రెండు నాజీయుద్ధనావలపై బాంబులుపడినవి- నార్వే మీదకూడ బాంబులు వేయబడినవి-

మే౭వతేదినుండి ౯వతేదివరకు బ్రిటనుపై జరిగిన జర్మనుదాడులలో మెర్సీసైడుపట్టణము మీద ఎక్కువగా దెబ్బలుతగిలినవి నష్టముకూడచాలఎక్కువగానే తుండెను. మే౭వ తేదినాటిరాత్రి ఒక శత్రు విమానము క్రింద కూల్చబడెను, ఈనాటిపగటిదాడిలో విశేషమేమియులేదు, అరాత్రి ౨౪జర్మనువిమానాలునష్టమైనవి, మే౮వ తేదిన మెర్సీసైడుతో పాటుపడమటి మిడ్లెండ్సు, తూర్పు సముద్రతీర ప్రాంతమున ఒకపట్టణము మంచిదెబ్బలనుతిన్నవి. ఈరాత్రి ౧౬ జర్మనువిమానాలుక్రింద కూల్చబడినవి. మే ౯వ తేదిరాత్రి మెర్సీసైడుతోపాటు లవర్పూలుకూడ జర్మనువిమానదాడుల దెబ్బలను ఎక్కువగాతిన్నది.

---

## వైరాగ్య మఠమునకు వైష్ణవపూజ

వైషణ్ పెంబర్తి జాగీరు (శ్రీ॥మహారాజా సర్ కిషన్ ప్రసాదు బహద్దరుగారి) గ్రామంలో ఒకపురాతనమైనవైరాగ్య (బైరాగి) మఠముపుండెను దీనినిత్య కైంకర్య (పూజ)నిమిత్తమై కొంత భూమివుండెను. యిదిగాకమన శ్రీనిజాంప్రభువుగారి (సరప్రకోను)నుండి ది ౧౩ రుగ చొప్పున యివ్వబడుచుండెనట పైఆదాయము సాధుసన్యాసులకొరకై వినియోగించబడుచుండెను కానియిటీవల వంశపరంపరగావచ్చిన మఠాధికారి మఠమును శిథిలాచరచిపోయెను హీనస్థితిగానుండినమఠమును ఉద్ధరణచేయదలచుకొనినకొందరు గ్రామాభిమానులు మఠాధికారినితొలగించ స్థానిక తహసీల్ కచ్చేరీలోవిజ్ఞప్తి (మహజర్ నామ) నిచ్చినందున ప్రభుత్వాధీనమైయుండెను.

ప్రస్తుతము (వైశాఖశుద్ధమినాడు) స్థానికపట్వారి తైర్యుల(3)ను తీసుకొనివెళ్లి మైమఠముపంచుజామా చేసి ఒక శ్రీవైష్ణవున్ని (లింగాలఘనపురనివాసిన్ని) నియమించుచున్నట్లు తెలియుచున్నది.

సర్వసంగపరిత్యాగులు, యోగులు, సన్యాసులు, తపస్విద్ధులు, మొదలగు విరాగులకునివాసయోగ్యమైనవైరాగ్య (బైరాగి)మఠము కుటుంబీకులు, సంసారులు, కర్మబద్ధులు, మొదలగువారికి అధీనమగుట ధర్మశాస్త్రవిరుద్ధము,

ఇట్లు
మఠాభిమాని

## ఒకకర్షకుని ఓవరుసియరు కొట్టుట

(ఒ. వి)

భువనగిరి ౨౯-౩-౫౦ ఫ

కొన్నిరోజులక్రింద భువనగిరిలో దుగ్యాలచంద్రయ్యయను కర్షకుని రామిరాతు యిలాక ఓవరుసియరు మహమదుయూసఫ్ గారుకొట్టగా భువనగిరి మున్సిపులో అర్జీయిచ్చెను మొదట పోహెబుసర్కారుయుద్యోగుల పైన సర్కారువారిఅనుమతిలేనిది అభియోగము తేకూడదనిత్రోసివేసిరి. కానిదుగ్యాల చంద్రయ్యదానినిగురాని ఉన్నతిన్యాయస్థానమున ప్రవేశపెట్టగా చ ౨౯ ఖుర్దాదు ౧౩౪౦ ఫసలినాడు హైకోర్టులోతీర్పుచేయబడి క్రిందికోర్టులోకిపంపిరి. ఒవరుసియరుపైన పెట్టబడినఅభియోగమునడువవచ్చునని ఉన్నతిన్యాయస్థానమునుంచి తీర్పుచేయబడినది ముందుఅభియోగము భువనగిరిమున్సిపులోజరుగును

ఈపైఅభియోగముయొక్క వివరము ఏమనగా దుగ్యాల చంద్రయ్యకర్షకునిమనిషి యొకపుబండిని బావివద్దికి గ్రామమునుండి తీసుకపోవుచుండగా బండిచక్రమువిర్గి బండిరాదారిలోవిడిచి రెండవచక్రము తీసుకవచ్చుటకు ఊరిలోకి వచ్చియుండెను. ఓవరుసియరుబండినిరాదారినుండి పక్కకుత్రోసివేయగా బండిరెండవచక్రముగూడ విర్గిపోయిబండిమూరుమూరుఅయినది. ఈవిషయము దుగ్యాల చంద్రయ్యచూచి విచారముతో రెండవవాడు తనబావినుండే గృహమునకువచ్చుచుండగా దారిలోఓవరుసియరుతో మాటలతో వాదముజర్గి దెబ్బలాటక్రిందవచ్చినది.

పా
-

సంఖ్యలోమరియు విద్యలోకూడ అభివృద్ధి దువలన ఇద్దాముపాహిగామార్చి ప్రభుత్వమువారు ఒక ఉపాధ్యాయు [మిడిల్ కామ్యాబు]ని నియమించిరి. అప్పటినుంచి ఉపాధ్యాయునిశ్రద్ధచాల అభివృద్ధిచెంది బాలురసంఖ్య మొదటికంటె ద్విగుణము [౫౦] అయెను ప్రస్తుతముబడియందు మూడవతరగతివరకే విద్యగఱపబడుచున్నందువలన బాలురకుఎక్కువచదువుటకు వీలులేకుండవున్నది ఈమూడవతరగతివరకైన ఒక్కపంతులు యున్నందునరెండుబడి బాలురకు భోదించుట చాలాకషతరము- దయచెసి విద్యాశాఖవారు యింకొక ఉపాధ్యాయుని నియమించి మాపాఠశాలాభివృద్ధికితోడుపడగలరని ప్రార్థించుచున్నాము

గమనిక.- ఒకప్రతి విద్యాశాఖవారికికూడ పంపినాము

ఇట్లు,
గ్రామప్రజలు.

...షనివాసమును
...వ మహమ్మదీ
...గా తెలియగలవు.-
...— సౌందర్యము ముఖ్య
...నందేమిలేదుగానిపట్టణమునకు
...త్యము లేచూడదగినవి నేడుల
...ంది 'మహమ్మదీయులున్నా
...క్తితము ...సంస్థానమున
...దుపరిచేయుండిరి ఒక
...నే మహమ్మదీయులగుట

...కారణములు చూడుడు:—
...పేరుగల ఒకనిథియాజ్ఞారాజా
...లోబర్చుకొనెను. అతడు హిందూధ
...లేక మహమ్మదీయమతము నవలంబించిన
...కోడు, కానిఅతడు హిందూధర్మమునే న
వాడు. అతడుప్రతిదినము "భగవద్గీతా" గ్రం
...ను ఒకపండితునివలన వినుచుండెడివాడు
ఒకరోజున భగవద్గీతయందు ఈక్రింది శ్లోకము
...వినెను

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా
త్స్వనుష్ఠితాత్। స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో
భయావహః॥

...పండితుడు పై శ్లోకమునకర్థము చెప్పుచు
...ట్లనెను:—

"ఇతరుల ఉత్తమధర్మముకంటె తనగుణహీన
...మమాత్రము కళ్యాణముకలుగజేయును. తన
...రము ప్రకారము మరణింపవలెనుగాని ఇతరుల
...మునంగీకరించుటకూడదని పలికెను.
[illegible] సికందరు కోపముతో శ్లోకము ను
[illegible] పరల బ్రాహ్మణుడ శ్లోపలుక
... సికందరిట్లు ప్రశ్నించెను,
...వే. "నేనుమీధర్మమును గ్రహింపశక్తి లేదని
...నా"
...బ్రా. "అవును తమతమ ధర్మములప్రకారమే
...మనవలెను" అనెట్లనగా భగవంతుడిట్లు పల్కి
...నాడు.

"స్వేస్వే కర్మణ్యభిరతః సంసిద్ధింలభతేనరః"
ఆశ్లోకమువినంతనే హిందూధర్మమున విరాళకలి
...గెను. సికందరు మరునాటిఉదయము రాజభవన
మున కూర్చుండియుండెను. అంతఒక ముదుసలి
...డు కడగ తో నీర్చుగొంపోవుచుండెను. అంత
...డు ఆముసలి వానిని పిలిచి యిట్లు ప్రశ్నించెను.
"నీ పేరేమి? "బుల్ బుల్ షాహ" నీవెవరు "మహ
మ్మదీయుడ"? "నీవునన్ను నీధర్మమును అవలంబింపని
...వ్వదవా" అనెను. "కాశ్మీరమహారాజ మహమ్మ
...దీయుడుగాకా వచ్చును ఆ పతకమించినగొప్పసం

************

# విదేశ వార్తలు

చంకింగుపై జపాను విమానదాడి.

మేనెలలోన చంకింగుపై జపానువారు విమానదాడి గావించిరి, ఈసంవత్సరములో నిదియే ప్రథమవిమానదాడి. 50 జపాను విమానములు నగరముయొక్క పశ్చిమప్రాంతములకువచ్చి బాంబులవర్షము కురిపించెను. చీనావిమాన విధ్వంసకశతఘ్నికలు బారుచేయబడెను. కాని హైటక్షేవియు జపానువిమానముల నెదుర్కొనలేదు.

రష్యాజపానులసంధి జపాను సేనాధిపతుల ప్రతిఘటనము

మేనెలలోన జపాను మంత్రి వర్గముయొక్క ప్రత్యేకసభ జరుగుచున్నది ఇండో చీనాలో జపానువారి చర్యవిషయమై ముఖ్యనిర్ణయములు మంత్రివర్గసభలో చేయబడవచ్చును, పధిక జపాను సేనానాయకులు, నౌకాధిపతులువిచ్చేసి జపానురష్యా తాటస్థ్యఒడంబడికను తీవ్రముగా ప్రతిఘటింతురని తెలియుచున్నది. యుద్ధసామగ్రి తమదేశముగుండపోరాదని యిటీవలరష్యావారు గావించినఉత్తరువు రష్యాతో సన్నిహిత భావము పనికిరాదను సేనాపతుల వాదములకు బలమొసంగగలదు.

వేగులవారిపై జపానుదాడి

వేగులవారిబాధనుండి యెట్లు తప్పించుకొనవలెనో తెలుపుటకు సోమవారమునాటినుండియు ఒకవారము టోకియోలో తీవ్రప్రచారము సాగింపబడను... ఈబాధనుండి తప్పించుకొనుట

---

గలేమి! ఇస్లామునకద్వారము మనుష్యమాత్రులెల్లరకు తెలవి...యున్నది".

అంత సికందరు మహమ్మదీయుడగుటకు వెనుదీయలేదు. మొట్టమొదలు కాశ్మీరములోని బ్రాహ్మణుల చావలలోచుట్టబెట్టి జీలమ్ నదిలో ముంచెను. కొద్దిదినములలోనే కాశ్మీరమంతయు మహమ్మదీయులైరి. బుల్ బుల్ షాహయొక్క గోరీ నేటికిని శ్రీనగరమందున్నది బ్రాహ్మణుల నంతరినిముంచినప్రదేశమును నేడు "బటమజార్" అనిఅందురు.

నేటిమహారాజా రణవీరసింహుడు కాశ్మీరపండితులెల్లరనుపిలిచి మహమ్మదీయులైనవారిని శుద్ధిపరచి తమలోకలుపమనే "రణవీరప్రాయశ్చిత్తవిధియను" పుస్తకమునువ్రాయించెను అయినప్పటికి కొందరు పండితులు మహారాజామాటలను లక్ష్యపెట్టలేదు.

---

రెట్లో ప్రజలకు పేర్పుటకు బ్రాడ్ కాస్టులు ఉపన్యాసములు గావింపబడును. సినిమాలు బొమ్మలమూలకముగా పద్ధతులను తెలుపును, పోస్టరులుగూడ నగరములో పంటింపబడును,

థాయ్‌లాండు-ఫ్రెంచి-ఇండో చీనా ఒడంబడిక

టోకియోలో రాయబారము జరిగిన తరువాత, థాయ్‌లాండు, ఫ్రెంచి, ఇండో చీనా ఒడంబడికవిషయమున అన్ని విషయములలోను ఒడంబడిక కుదిరినట్లు తెలియుచున్నది. రాబోవు వారమున ఈఒడంబడికపై సంతకములు జరుగవచ్చును.

ఎవ్వరును రష్యామీదికి రా సాహసింపజాలరు

ఏయుద్ధరంగమునందైనను, ఎవ్వరికోసైనను రష్యాసైన్యములుడీకొని జయి వగలవని మేడేసైనికప్రదర్శనమువలన స్పష్టమయ్యెను, అని ప్రవ్దాపత్రిక వ్రాసినట్లు మాస్కో రేడియో ప్రకటించెను ఆనాడుజరిగిన సైనికప్రదర్శనమువలన రష్యాసేనలు అజేయములని స్పష్టమయ్యెను. మనవిమానవిధ్వంసక శతఘ్నులనుదాటి శత్రువిమానమేదియు లోనికిరాజాలదని పత్రిక వ్రాసెను.

అమెరికానావలు సూయెజుచేరుట

యుద్ధసామగ్రితో అమెరికానావలు సూయెజుచేరినవార్తనిజమైయుండవచ్చునని అమెరికా నౌకాధికారులుచెప్పిరి గ్రీసు, యుగోస్లావియాలకు సామగ్రితీసుకొని అమెరికానావలు ఏప్రిలుమాసారంభమునవెళ్లెను. ఈరెండుదేశములును తరువాతఓడిపోయినను సామగ్రికి ఆర్డరులు రద్దుచేయబడలేదని అధికారులద్వారా తెలిసినది

ఇంగ్లాండుపై దండయాత్ర యెప్పుడు జరుగును?

బ్రిటనుపై దండయాత్రజరుగునా? జరుగుచో నెప్పుడుజరుగును, ఆమవిషయమును తెలిసినవాడు ప్రపంచములో నొక్కడుమాత్రమే కలడు_అని నాజీప్రభుత్వపత్రికయగు 'డెస్ట్ష్‌అప్‌దూమ్‌లాండు' పత్రిక వ్రాయుచున్నది. దండయాత్ర జరుగనిచో బ్రిటిషు సామ్రాజ్యమునకు ప్రాణతుల్యమయిన రహదారులనరికట్టుట యొక్క లేకర్తవ్యమని పత్రికవ్రాయుచున్నది దండయాత్రచేయుట లేక సామ్రాజ్యరహదారుల నరికట్టుట ఈరెండే బ్రిటనునుఓడించి, పాదాక్రాంతముజేయుటకు సాధనములని పత్రిక అంగీకరించుచున్నది.

హంగరీ తుర్కీల ఆర్థికఒడంబడిక

హంగరీకిని తుర్కీకిని, ఆర్థిక, వాణిజ్యఒడంబడికచేసుకొనబడెనని స్విస్ రేడియో ప్రకటించెను జూన్ ఒకతారీఖున యిదిఅమలులోనికి వచ్చును. రెండుదేశములమధ్య వాణిజ్యము హెచ్చుటకిది సానుకూలమై యుండును అని రేడియో ప్రకటించెను.



---

బ్రిటనుకు సురక్షితముగ యుద్ధసామగ్రి చేర్చుటకై విల్కీగారి ఒత్తిడి

వాషింగ్టనులో మేనెలలోన "బ్రిటన్‌కు సరకులు మనమే చేర్చవలెను, ఇప్పుడు ఇందుకు సముద్రముపైనున్న గస్తీచాలదు" అని వెండెల్ విల్కీగారు పత్రికలకు ఒక ప్రకటనచేయుచు తెలిపిరి.

మనముపంపుచున్న నావలు హెచ్చుగ ముంపబడుచున్నవి అందువలన మనముపంపు ఆయుధములను సామగ్రులనురక్షింపవలెను. సేనాధ్యక్షుడనైతే వీటిని సురక్షితముగ ఎటులజేర్చవలెనో ఉత్తమఅనుభవజ్ఞుల సలహాలనుపొంది కర్తవ్యమును నిర్ణయించెడివాడను యుద్ధనౌకల రక్షణతోగాని, విమానరక్షణతోగాని, ఏదిఉత్తమమార్గమని తోచినదానితో సరకును సురక్షితముగ బ్రిటనుకు చేరుమార్గము నేను అవలంబించెడివాడను. అని విల్కీగారనిరి.

శత్రుయుద్ధ నౌకలు ముంచబడుట

మేనెలలోన మధ్యధరాసముద్రమునందు శత్రువులయుద్ధనౌక, సరకులనావ ముంచబడెనని ప్రకటించిరి.

ఫిన్లెండు నికెల్ గనులపై జర్మనుల కన్ను

ఉత్తరఫిన్‌లెండునందలి పెట్సామోవద్దనికెల్ గనులు కలవు గతసెలలక్రిందట ఫిన్లెండులో పోరాటము జరిగినప్పుడు ఈగనులు పాడయ్యెను. ఇప్పుడీ గనులను [illegible]కు నాజీలు ప్రయత్నించుచున్నారు గనులలో భాగస్థులతో రాయబారములు జరుగుచున్నవని జర్మనువిదేశాంగకార్యాలయమువారు తెలుపుచున్నారు. దీనిలో భాగస్థులు బహుశః ఫిన్లెండువారు, రష్యావారునైయుందురు. రష్యా- ఫిన్లెండు యుద్ధమైనతరువాత ఈగనులు ఆంగ్లో- కెనడా భాగస్థులనుండి ఫిన్లెండుభాగస్థులకు సంక్రమించెను_వీనిలో సోవియటుకుగూడ భాగమున్నదని చెప్పబడుచున్నది-

---

సంవత్సరము చందా
౬ హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
౩ రూపాయిలు
బ్రిటిషిండియాకు
సం॥ చందా
౫-౮-౦ శిల్లాను
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

6 **Hyderabad-Dn** Monday 12th May 1941 *Number* 3


## ఊడిచెట్టుక్రింద ముచ్చట్లు

(కే. ఎం. మున్షీ గారు)

పూనాలోని యరవాడా సెంట్రలు జైలుప్రవేశించగానే ఎడమప్రక్కన ముందుఆవరణ వున్నది. దీనిని అక్కడి ఖయిదీలు యరవాడమందిర్ అనిఅంటారు. ఈమందిరములో ఒకగున్నమామిడిచెట్టువుంది. యిది చూడదగిన దృశ్యము. దీని రూపంలో ప్రత్యేకతవుంది. దీనికిసమీపగదిలో నేను మార్చి౧౯౪౧తారీఖువరకు వున్నాను

ఈచెట్టుక్రింద మహాత్మా గాంధీగారు కొంతకాలమువుండి అక్కడే పడుకుంట వ్రాయుట, ప్రార్థన మొదలైనపనులన్ని చేసియున్నారు. హిందువులలో ఐకమత్యత చేకూర్చుటకుగాను మహాత్ముడు ఈచెట్టుక్రింద నిరాహారదీక్ష పూనినారు భగవద్ధ్యానముకూడి అచ్చటనేచేసేవాడు కనుక మనమందరికి కూడాను బోధివృక్షంలాగ పవిత్రమైనది. సర్దార్ భూలాభాయిదేశాయి, ఖేర్, మంగల్ దాస్ పక్వాసా డాక్టర్ గిల్డర్, జనాబ్ నూరీ, పటేల్ నేను ఈ చెట్టుక్రింద చేరేవారము, పటేల్ గారికిఅక్కడ ౧౯౩౩ నాటి గాంధీగారి నిరాహారవ్రతదినాలను జ్ఞప్తి చేస్తూవున్నాయి అప్పటి వాతావరణంలో జరిగినఉదంతాలు చెప్పుతూవుండేవారు సర్దార్ గారు.

ప్రార్థన

ప్రార్థనకాలంలో మాలో జనాబ్ నూరీగారు ఖురాన్ పఠనచేసేవారు డాక్టరుగిల్డరుగారు గాథ అనుచేస్తారు ఖేరుగారు నేను భగవద్గీతచదివేవారము. "రఘుపతిరాఘవరాజారాం"అని భజచేస్తూవుంటే నాకుమ్మట్టకు గాంధీగారు (బాపూ) అక్కడవున్నారాఅని అనిపించేది ఈచెట్టులో ఏముందో అన్ని మతాలవారికలిసి ఈశ్వరోపాసన చేసేవారు. ఈచెట్టుక్రిందలోని బౌద్ధగురువులు బాధాలులాగ నిర్జనస్థలంలో ఈశ్వరోపాసన చేస్తూవుండేవారము యరవాడలో.

సర్దార్ పటేలుగారు

పటేలుగారు పట్టుదలకుప్రసిద్ధి-మనము వీరిని రాజకీయవీరుడుగ తెలుసుకున్నాము. కాని వీరిలో అంతరంగికంగా వుండిన మతాభిమానమును గూర్చి తెలుసుకొనుట చాలఆశ్చర్యమైనది. వీరు ఒక్క గాంధీగారికి మాత్రం ఆత్మబలిదానమైనారు. శ్రీకృష్ణభగవానుడుచెప్పినట్లుగ "నిమిత్తమాత్రంభవసర్వసాచిన్"అని కర్తవ్యాన్ని వర్ణిస్తున్నారు

నాన్నెహితుడు ఖేరు

ఖేరుగారు నాకు చిరకాలస్నేహితుడు- వీరు భగవత్సేవాతత్పరుడు వీరికి మతవిషయక విజ్ఞానమునందిచ్చెమెందు వీరు బొంబాయివిశ్వవిద్యాలయము మన్ననబడసినవారు. వీరు దినమంతా గీతాపఠనములోమునిగేవారు. యింకా అక్షరమధజవలినుండి గీతాలుపాడేవారు.

డాక్టరు గిల్డరు

డాక్టరుగారు వృత్తిరీత్యా నాస్తికుడని పేరుపొందినవారు-యిన్నాళ్ల స్నేహం కలిగియున్నా వీరిలో యింత ఆస్తిక స్వభావమున్నదని యిప్పుడుమాత్రం తెలుసుకొంటిగాను వీరికిమతమూలం లేనిట్టినమ్మకము గలదు.

జనాబ్ నూరీసాహెబ్

వీరు ముస్లింభక్తులు వీరు కాంగ్రెసుమంత్రిగ వుండగ వినియ్యచేసిన ముస్లింలీగు నాయకులలో హెచ్చుమంది వీరుతెలుసుకున్నంతగ ఇస్లాం సిద్ధాంతము అను తెలుసుకొనివుండరు. వీరుఎప్పుడూ ఖురాన్ చదివేవారు. మహమ్మదుప్రవక్తనుగురించి ఒకవ్యాసము వ్రాసినారు.

శ్రీ పటేలుగారు

వీరుభక్తులు. వీరుతుకారాం, జ్ఞానేశ్వర మొదలైన మహారాష్ట్ర భక్తుల సాంప్రదాయంలోనివారు భక్తేపటేలుగారికిభుక్తి-వీరికి భగవద్గీత తులసీదాసు రామాయణములు గ్రంథాలు.

అధ్యక్షుడు పక్వాసాగారు

జీతంరాకపోయినా అధికారం లేకపోయినా వీరింకా గౌరవనీయులగు అధ్యక్షులే- వీరు మాతో ప్రార్థనలలో పాల్గొనేవారు- వీరునిష్కామ భక్తుడు-

భూలేభాయి దేశాయిగారు

వీరు అగర్భశ్రీమంతులు-వీరికి ఆధ్యాత్మికము అంటె అవసరము లేదు అయినప్పటికి వీరు చెరసాలలో భగవద్గీతనువినేవారు- భగవద్గీతాఉపదేశాలను దినచర్యలో ఎలాఆచరణలో పెట్టాలాఅనిఅలోచిస్తూవుండేవారము

నా సంగతి

వృత్తికారణాలవల్ల రాజకీయ కారణాలవల్ల ప్రతిబంధకములు వాటిల్లిన జీవితాధారముల పున

ఉద్ధరణగూర్చి అలోచిస్తూ వుండేవాడిని- భక్తులమయ్యామని కాదు

ఇందువల్ల మేమందరము పరమభక్తులమయ్యామని ఎవరూఅనుకొనకూడదు- మేముకూడ మానవమాత్రులమే మేము మాట్లాడుకొనేవాళ్ళము, పాడేవాళ్ళము, నడిచేవాళ్ళము, మాలో కొంతమంది పొగపీల్చేవారు, కొంతమంది పేకాడేవారు. పత్రికలను బహుఅతుర్తతో చదివేవారము- సేవలు జాతులభవిష్యత్తునుగూర్చి అలోచించేవారము

మహాత్ముని పల్లి

మేము పిట్టలకు మేతవేసేవారము- పెంపుడు పిల్లులను దగ్గరకుతీయడం జైలఅలవాటు జైలులో వుండేవారికి, అందులో మాకో ప్రత్యేకత వచ్చినది ౧౯౩౩లో మహాత్ముడు ఈచెట్టుక్రింద ప్రార్థన చేసుకుంటూవుండగా పెంపుడుపిల్లి అయన తొడమీద పిల్లలనుపెట్టినది అసంగతివేరుని ఈపిల్లులు మాకుతెలిసింది

గాంధీగారు మాలో అస్తికత్వాన్ని గురించి సంశయించేవారు-భగవత్ప్రార్థన ఆధ్యాత్మిక చింతనిదే వారిని ప్రత్యక్షంగాకాని పరోక్షంగాకాని సమీపించుటకు వీలువుండదు. ఏదోవిధంగా ఈ పవిత్రమైన మఱిడిచెట్టుక్రింద మాకు ఆధ్యాత్మిక చింతనకు సావకాశము ఏర్పడినది.

## నిజాం వీరశైవపరిషత్తు

నాల్గవ అధివేశనము హైదరాబాదు

స్వాగతసమితివారి ప్రకటన

పూర్వకాలమునందు హిందూస్థానమునందంతటవ్యాపించి జనుల నైతిక, ధార్మిక, ఆర్థికపరిస్థితులను విస్తారమొనర్చినమనమతము నేడుఅత్యంతహీనావస్థయందున్నది ఏధర్మమునందు, శ్రేష్ఠమగుసాహిత్యవిశారదులు, వీరులగుసేనాధిపతులు, ఆదర్శప్రాయులగు రాజాధిరాజులు ఉద్భవించియుండిరో! ఆధర్మావలంబులు నేడుచెప్పరానట్టి అజ్ఞానమునమునిగియున్నారు

మనతోటివారలగు బ్రిటిషు కర్ణాటకమందలి వీరశైవులజాగృతివలన అధోగతిస్పష్టమగుచు కనుకనేవారు రాజకీయ, సామాజికరంగములయందు ముందుకొచ్చిన ఇతరవీసమాజమువారికిని తెలుదీయకపమానులైనిలిచియున్నారు.

మనమందుకేవలము ౧౦౦కి ౨ ౩రు మాత్రమాత్రమేవిద్యావంతులుగలరు మనలోభేదముద్వేషము, మొదలగునవన్నియు నెలకొనియున్నవి వ్యాపారమంతయు మనవారిచేతినుండితొలగిపోవుచున్నది. వ్యవసాయికులు దినదినమునష్టపడుచున్నారు- విద్యావంతులగు మనయువకులకు సర్కారుఉద్యోగములు దొరుకుటకష్టమగుచున్నది-

ఇట్టిదుస్థితి మనసమాజమున కొనసాగాదక, సర్వతోముఖాభ్యుదయముగలుగవలయునని శ్రీలానవానులగు ధర్మవీర ఉద్గీర సంగ్రామప్ప శెట్టిగారు నిజాంప్రాంతీక వీరశైవపరిషత్తును సమావేశపరచినను హెచ్చరించిరి ఇంతవరకుకూడినమూడుఅధివేశనములవలన నిజాంరాష్ట్రవీరశైవులయందు మనంగుటన, స్వాభిమానభావములుద్భవింప ప్రారంభమైయున్నవి-

నైజాం ప్రాంతీక వీరశైవపరిషత్తుయొక్క అధివేశనము ఈసారి హైదరాబాదు పట్టణమునందు కూడును. ఈఅధివేశనమునందుమనవీరశైవులందరికి అత్యంతఅవశ్యకములగు సమస్యలపై విచారమొనర్చవలసియున్నది- కనుక అధివేశనమునకు కనక్ ప్రతినిధులను పంపుటయందు మరియుదానిఖర్చులనిమిత్తము ధనముకూర్చుటయందును ప్రయత్నమొనర్చవలయును ఈఅధివేశనములోపలనే మీమీస్థానములయందు జిల్లా, తాలూకా, మరియు గ్రామకమిటీలను యేర్పాటుచేసుకొని నాల్గణాలసదస్యులనుసంఖ్యను త్వరగాయెక్కువచేయవలయునని ప్రార్థించు-

హైదరాబాదు అధివేశనపు,
స్వాగతసమితి అధ్యక్షుడు
యస్ సోమేశ్వరరావు,
మహిళాపరిషత్తుయొక్క-
స్వా॥ స॥ అధ్యక్షిణి
మైనాదేవి షే.

## ఆయుర్వేదవైద్యము

ప్రభుత్వమువారి సహాయము

హైదరాబాదు (దక్కను) తేది ౧ ప్రభుత్వ ప్రకటన శాఖవారిట్లు తెలుపుచున్నారు.

మ.ఘ.వ. నిజాముప్రభువుగారు రాష్ట్రములోని ఆయుర్వేదవైద్యాన్ని ప్రోత్సహించుటకై ఏర్పాటైనప్రణాళికకు అంగీకారమును ప్రసాదించియున్నారు. దాని ప్రకారము ప్రథమములో ౪౩౦౦౦రూ॥ వ్యయముచేయబడును. తర్వాత ప్రతిసంవత్సరమున్నూ ౩౫౦౦౦రూ॥ వ్యయము చేయబడును. ఈప్రణాళిక ననుసరించి ఒకసమాలోచకసంఘము నిర్ణయింపబడును అందు వైద్యశాఖ కార్యదర్శిగారు అధ్యక్షులుగాను మరి ఏడుగురుసభ్యులున్ను కలసి ఒకసంఘముగా ఏర్పడును. ఈఅధ్యక్షుడు ఆయుర్వేదశాఖను విచారించుచుకొనును ఆయుర్వేద కళాశాలను ఆయుర్వేద అస్పత్రులను విచారించుకొనును.

హైద్రాబాదు నగరంలోని సుల్తానుబజారులోఉండు నిజాంఆయుర్వేదిక కేంద్రహాస్పిటలును ప్రభుత్వమువారు తమఆధీనములోనికి తీసుకొన్నారు-ఇప్పుడు ప్రభుత్వం క్రిందనే అది పనిచేయుచున్నది. అందు దినముప్రొద్దున ౭నుండి ౧౦గంటలవరకు సాయంత్రము ౫నుండి ౭గంటలవరకును ఉచితముగా అందరికిని మందులిత్తురు- ఇదికాక ఒకసంచారక చికిత్సాసంఘము ఏర్పాటైనది- ఆసంఘమువారు ఉరుసులకు జాత్రాలకు, సంతలకువెళ్లి మందులిత్తురు

ఆయుర్వేదకళాశాల ౧ఆమర్దాదు నుండి పనిచేయును-అందు నాలుగేండ్ల విద్యావిధము నిర్ణయమైనది- నాలుగేండ్లు చదివి పరీక్షయిచ్చి కడతేరినవారికి పదవులియ్యబడును-

## అఖిలభారత పద్మశాలి మహాసభలు

స్థలము షోలాపూరు

తారీఖులు వృషసంవత్సర వైశాఖ బ॥ ౬, ౭, ౮, (౧౯౪౧ మే ౧౬,౧౭,౧౮

### పద్మశాలిఅష్టమమహాసభ

అధ్యక్షులు శ్రీమాన్ ధికొండ సాయన్న గారు (అహమ్మద్ నగర్)

### పద్మశాలి చతుర్థయువక మహాసభ

అధ్యక్షులు శ్రీయుత కార్యంపూడి రాజమన్నాగారు, ఎం. ఏ. (ఆనర్సు) (ఒంగోలు)

### పద్మశాలిద్వితీయ మహిళాసభ

అధ్యక్షురాలు శ్రీమతి వై. ఆర్. రంగమ్మగారు, బి. ఏ. బి. టి. (బెంగళూరు).

## చందాదారులకు మనవి

చందాదారులు మా కార్యాలయమునకు జాబులు వ్రాయునప్పుడు, మనిఆర్డర్లు పంపునప్పుడు, తమ చందానెంబరు వ్రాయుటయందు తగుశ్రద్ధ గైకొనుటలేదు చందా నెంబరు వ్రాయనిది వెంటనే జవాబీయుటకు వలనుపడదు కాన చందాదారులెల్ల ముఖ్యముగ గమనింపకోరెదము.

మేనేజరు, గోలకొండపత్రిక.

## మ. ఘ. వ. నిజాం స్టేటు రైల్వే.

### నోటీసు

జానకంపేట, బోధన్ రైలు బండ్లు 15 మే 1941 నుండి మార్పు

గురువారము 15 మే నుండి 1941 నుండి క్రింద నుదహరించబడిన ప్రకారము నిజామాబాద్ బోధన్ సెక్షన్ రైలుబండ్లు మార్చబడును

| | | 50 మిక్స్డ్ | 52 మిక్స్డ్ (ప్యాసంజెర్లు) |
|---|---|---|---|
| నిజామాబాద్ | పోక | 6-30 | 12.10 |
| జానికంపేట జంక్షన్ | , | 6.50 | 12 23 |
| జానకంపేట రోడ్డు | , | | |
| అలిసాగర్ | ,, | 7.09 | 12-39 |
| ఏదపల్లి | , | 7.28 | 12.51 |
| బోధన్ షుగర్ ఫ్యాక్టరీ సైడింగు | ,, | 7-44 | 13.04 |
| బోధన్ | రాక | 8.20 | 13.13 |
| | | 49 మిక్స్డ్ | 51 మిక్స్డ్ |
| బోధన్ | రాక | 9-00 | 13-34 |
| బోధన్ షుగర్ ఫ్యాక్టరీ సైడింగు | ,, | 9.03 | 13.41 |
| ఏదపల్లి | ,, | 9.52 | 13.55 |
| అలిసాగర్ | ,, | 10.07 | 14.07 |
| జానకంపేట రోడ్డు | ,, | 11- | — |
| జానికంపేట జంక్షన్ | ,, | 10-33 | 14-22 |
| నిజామాబాద్ | రాక | 10.55 | 14.37 |

జానకంపేట రోడ్డు స్టేషన్ 15 మే 1941 నుండి తీసివేయబడును

సికింద్రాబాదు
8 మే 1941

బై ఆర్డర్
ఎ.డబ్ల్యు. వాట్స్.
చీఫ్ మానేజింగ్ డెంటు.

## మ. ఘ. వ. నిజాంస్టేటు రైల్వే

### నోటీసు

డోర్నకల్లు భద్రాచలం రోడ్డు సెక్షను రైలుబండ్ల మార్పు

గురువారము 15 మే 1941 నుండి భద్రాచలం, డోర్నకల్లు రోడ్డు జంక్షన్ మిక్స్డు రైలు బండ్లు ఈ క్రింద నుదహరించబడిన ప్రకారము మార్చబడినవి

| | రాక | 18 మిక్స్డ్. | 20 మిక్స్డ్ |
|---|---|---|---|
| డోర్నకల్లు | | 10-52 | 21.50 |
| కారేపల్లి జంక్షన్ | ,, | 11.27 | 22-25 |
| తడికలపూడి | ,, | 12.22 | 20-22 |
| భద్రాచలంరోడ్డు | పోక | 13.20 | 00.20 |
| | | 17 మిక్స్డ్. | 19 మిక్స్డ్ |
| భద్రాచలంరోడ్డు | రాక | 14.42 | 02.10 |
| తడికలపూడి | ,, | 15-27 | 02.55 |
| కారేపల్లిజంక్షన్ | ,, | 16.40 | 04.09 |
| డోర్నకల్లు | పోక | 17-20 | 04.50 |

సికింద్రాబాదు
మే 8 1941,

బై ఆర్డర్
ఎ. డబ్ల్యు. వాట్స్.
చీఫ్ ట్రాన్సు పోర్టేషన్ మానేజింగ్ డెంటు,




Printed and Published by, G Ramakrishna Reddyat the Golkonda Power Press Hyderabad-Dn. Editor- S Prathapa Reddy B A B.L.